# వసంతము

రచన:

బద్దెపూడి రాధాకృష్ణమూర్తి, బి. ఏ. బి. ఎల్.

సంస్కృతి ప్రచురణ

(38)

వెల రూపాయి

సంస్కృతి ప్రచురణ - 38

ఆరవ ముద్రణ

వెల రూపాయి

1-7-1965



24 పౌ. ఇండియన్ వైట్ గ్లేజ్ డబుల్ క్రౌన్ కాగితముపై ముద్రింపబడినది.

*Approved by the Madras Text Book Committee for Class use - Nondetailed study for 8th standard Vide - F. St. G. Ga - D/ 10-5-1951 Page No. 17.*

# జాతీయ గీతము

జన గణ మన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా,
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా,
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధితరంగా,
తవశుభనామే జాగే తవశుభ ఆశిష మాగే
గాయే తవజయగాథా,
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా,
జయహే జయహే జయహే
జయ జయ జయ జయహే॥

* * * *

సమస్త జనుల హృదయములను పరిపాలించు
భారతదేశ సౌభాగ్యకర్త వైనట్టి నీకు జయమగుంగాక !
నీ శుభనామము పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రము,
ద్రావిడము, ఉత్కళము, బంగాళము మున్నగు దేశజనుల
మనస్సులను ఉప్పొంగం జేయుచున్నది.
అది వింధ్య, హిమాచల పర్వతములలో ప్రతిధ్వనించుచున్నది.
యమునా గంగా నదుల ప్రవాహగీతములందు విలీనమై,
హిందూ సముద్ర తరంగములచే గానము చేయంబడుచున్నది.
నీ ఆశీర్వచనములకొఱకు వారు ప్రార్థించుచు,
నీ కీర్తిని గానముచేయుచున్నారు.
భారతదేశ సౌభాగ్య కర్తవగు నీకు
జయమగుంగాక, జయమగుంగాక, జయమగుంగాక.

"దీపా! దీపా!"

సమాధానము రాలేదు.

"ఏమి, రాణిగారు పలుకుటయే కష్టమైనది! తీఱుబడి లేనంతగ పనియున్నదేమో!"

"అబ్బ! చాలులెండి, మీ వెక్కిరింపులు, వెటకారములును. ముందు రాణి, పైన గారుగూడనా? నాకెందుకు ఇన్నిరకముల సంబోధనలు? అన్నియుఁగలవారికవి అందము గాని, నాకేమి అందము? ఇంతకు మీరు పిలిచిన పని చెప్పక పోతిరి?"

"దీపా! నీవు ఇంటికి మణిదీపము వంటిదానవు. కాని..."

"కాని-అని ఆఁగితి రేమి? విషయ మేమియో పూర్తిగ చెప్ప రేల?"

"చెప్పుట కేమున్నది? అంతయు మామూలే. నీ మనసు నే నెఱుఁగక పోలేదు. దేవుని అనుగ్రహము కల్గినఁ గాని మన కొఱంత తీఱదు. ఆనాఁడుగాని మనకు సంతోషము గలుగదు. అట్లని, అంతవఱకు దినదినము చింతపడుచున్న నేమి లాభము?"

"లాభమో, నష్టమో నాకు తెలియదు. ఒక నాఁటి కైన నా అదృష్టము మాఱునని, మంచిరోజులు కలుగునని

నాకు నమ్మకము లేదు. అచ్చట్లు ముచ్చట్లతో అందచందాల బిడ్డల నెత్తుకొని ఇరుగు పొరుగు ఇల్లాండ్రవలె నుండ నోచుకొనక పోతినిగదా అనియే నా ఆలోచన. కొఱనోములు నోచిన నాకు ఎక్కువ ఫలితము లెట్లువచ్చును లెండి!"

"అనవసరముగ కించపొందుట నీకు అలవాటైనది. ఎడతెగని ఆలోచనతో, అంతులేని ఆవేదనతో కృశించుట తగదు. ఎల్లప్పుడు ఉల్లాసముగ నున్నచో మనస్సునకేకాక శరీరమునకుఁగూడ ఆరోగ్యము హెచ్చును. అదియే ఆనందము ఐశ్వర్యమును. పిచ్చిదానా! లోకము విషయము చూచుచుంటివిగాని, సూక్ష్మములను గ్రహింపకుంటివి. లోకములో నే కొఱంతయు లేనివారు ఎవరుందురు? ఏదియో లోపముండె నని, దానికై వగచుచు. సౌఖ్యజీవితమునకుఁ చేసేతుల అడ్డంకులఁ గల్పించుకొనుట వెఱ్ఱితనము. కొఱంతలను గాని, కష్టములనుగాని మఱచి జీవితమును సుఖప్రదము చేసికొనుట మానవుల విధి. అది మానవ విజ్ఞానమునకు గొప్పతార్కాణము."

"మీరేమియో అందిక పొందిక లేని విషయము నను..."

"నిజమునకే. నేను చెప్పునదంతయు నిజమే. సామాన్య విషయములలోనేకాక నిజమునకు ప్రకృతిలోఁగూడ ఇట్టి చిత్రము లున్నవి. తెల్లని జాబిల్లికి నల్లనిమచ్చ లోపమేనా?

చక్కని గులాబికి ముండ్లేందుకు? కోయిల కంఠపు కమ్మదన మునకు సరిపడిన రూపము లేదని ఒప్పుకొందువా? ఇవి యన్నియు లోపములు గా వందువా? అట్లని, చంద్రుఁడు చల్లని వెన్నెలను వెదచల్లుట వీడెనా? గులాబి కమ్మతావులు విరజిమ్ముట విడిచెనా? కోయిల మధురగీతికలు పాడుట మానుకొనెనా?"

"బాగున్నదిలెండి, మీ ఉపన్యాసము! పిలచిన విషయము చెప్పుట విడిచి, కవిత్వధోరణి మొదలు పెట్టు చున్నారు!"

"కవిత్వధోరణి మొదలుపెట్టు టేమిటి? నీ నగు మోముఁ జూచినపుడు ఒక మహాకావ్యమునే చెప్పఁగలను. చదువుకొనినదానవు, సరసురాలవు, నీ సరస---"

"మంచిది, మంచిది. ఈ పొగడికోలు అధ్యాయము ఇంక చాలులెండి. ఇంతకును అహ్మదునగర ప్రయాణము ఎపుడని నిశ్చయించితిరి?"

"అదిగో, అపుడే గ్రహించితివి. నేను చెప్పఁదలఁచిన విషయముగూడ ఇదియే. నేను చెప్పునది కావ్యమంటివే; కావ్యమునకు తొలిపలుకు నీవంతు అనియా ఈ సూచన?"

"సరి, ఇంతకు మీ ధోరణిని విడువరా ఏమి?'

"నేను నా ధోరణిని విడచు టెట్లున్నను, మనము చాలతాబాపసు విడచుట మాత్రము నిశ్చయమైనది. అహ్మదునగరమున మన నివాసమునకు అన్ని యేర్పాటులను

పూర్తిచేసితిని.''

''ఏర్పాటులన్నియు పూర్తియైనచో ఇఁక అడ్డంకి ఏమి ?''

''అడ్డంకి ఏమియు లేదు. రాణిగారి అంగీకారముద్రయే తరువాయి.''

''ఓహో! అలాగుననా ? రాణి పదవి నిచ్చితిరి; మఱి ముద్రగూడ చేయించితిరా ? మీరు కోరినట్లు ఫర్మానా వ్రాయించి, ముద్రవేయించి యిత్తును.''

''అవశ్యమటులే. ఇందుకు తప్పుఁగలనా? ఇంకొక విశేషమును గలదు. మామూలు రాణియైనచో ఆమె చెప్పిన తరువాతఁగాని పనులు జరుగవు. మఱి నీ విషయమున ఏమి జరిగినదో ఊహించితివా ? నీవు రాణిపట్టము గట్టుకొనక ముందే-'మూఁడు ముడులు' పడకముందే-ముద్ర చేయించితిని. నీనోట మాటరాకముందే, నీ కనుసన్నయైన తిన్నగ కలుగకముందే, నీ చేయిఁబట్టి, పట్టముగట్టి, ముద్రకై ముచ్చటైన ఉంగరముఁబెట్టితిని. ఇదిగో, ఇదియే సాక్ష్యము,'' అని మెల్లగ నవ్వుచు మల్హారి ఆమె ఉంగరమును చూపు నెపమున భార్యయగు దీపాబాయిహస్తము నంటెను ''ఔనులే'' అన్నట్లు దీపాబాయి ముఖము వికసించెను.

*    *    *    *

మల్లాజి భోంస్లా వివేకి. మాటచతురత గలవాఁడు. ఉన్నతాభిప్రాయము లతని కుగ్గుతోఁ బెట్టినవి. పనినిసాధించు పట్టుదల అతనికి స్వాభావమైనది. ఎవరికైన నెట్టి విషయమునైన అతఁడు ముచ్చటగ నచ్చఁజెప్పఁగలఁడు. కష్టమున ఓర్పు, గట్టికార్యములలో నేర్పు అతనికి పెట్టని సొమ్ములు.

మల్లాజి భార్య దీపాబాయి అందకత్తె; అనుకూలవతి. ఆమె నింబలవంశీయుఁడగు రావునాయకుని సోదరి. ఆమె పుట్టినిల్లు, మెట్టినిల్లు సంపన్నములు. వంశగౌరవమునకు, విద్యకు పన్నెపెట్టిన కుటుంబములు.

ఆ కాలమున అహ్మదునగర రాజ్యము ప్రసిద్ధ రాజ్యములలో నొకటి. అహ్మదునగర సుల్తానులు గుణవంతులను మెచ్చువారు, మెచ్చినవారికి తృప్తినిచ్చువారు అని ప్రతీతి.

దౌలతాబాదు కాఁపురముపైఁ మల్లాజికి మనసు రోసెను అతఁడు కాఁపురమును లచ్చికాఁపురమగు అహ్మదు నగరమునకు మార్ప నిశ్చయించుకొనెను. నివాసమునకు తలసిన వసతుల నన్నిటి నేర్పఱచుకొని అహ్మదునగర ప్రయాణమునుగూర్చి భార్యతో ప్రస్తావించెను. అహ్మదు నగరమున అందల మెక్కఁదగిన యదృష్టము కలుగకపో దని లోలోన తీయని తలఁపులీఁగలు పెంచుకొనుచున్న ఆ ఆలు మగలీ విషయమునను 'దేహములు రెండు, కాని

ఆత్మ ఒకటే' అన్నమాటకు నీటుగొల్పిరి.

మల్లాజి నివాసము మార్చుచున్నాఁడను వార్త క్షణములో రెక్కలు గట్టుకొని ఊరేగినది.

"మల్లాజి మంచి చెలిమికాఁడు. మాణిక్యమువంటి వాఁడు. మనఊరు వదలిపోవునఁట."

"గొప్ప పదవులు కోరుచున్న మల్లాజి మఱి మన ఊరిలో ఇంకను ఉండునా?"

"ఇక్కడ ఏమిలోటు కల్గినది? ఏమి. మన దౌలతాబాదు మాత్రము ఏ విషయములో తీసిపోఁగలదు?"

"లేనివెఱ్ఱిగాని, గొప్పపదవి కావలెనని కోరినచో ఇక్కడమాత్రము దొరకదా ఏమి?"

"చిలుక-గోరువంకలవలె చూడ ముచ్చటైన జంట. మన ఊరు విడచివెళ్లుట మనకుఁగూడ కష్టమే."

"వెళ్ళదలఁచినవారు వెళ్ళవచ్చు; ఉండఁదలఁచిన వారు ఉండవచ్చు. ఇందులో ఇమిడిన బ్రహ్మాండ మేమి ఉన్నది, ఇంతగ చెప్పుకొనుటకు?"

"మంచివారిని మంచిఅనుట, చెడ్డవారిని చెడ్డ అనుట లోకము పుట్టినపుడె పుట్టినసంగతి. మల్లాజి మంచితనమునకు మెఱుఁగుఁబెట్టు మెలఁకువ దీపాబాయిలో ఉన్నది. ఆ ఇల్లాలి అనుకూలత అతనికి సాగా పెట్టినది."

"ఇన్నాళ్లులేని ఆలోచన మల్లాజికి ఇపు డెందుకు కల్గినదో?"

"ఏమో, మల్లాజి ప్రయాణము అదృష్టమునకు ఎదురు నడక కాదుకదా?"

"భల్లూకపు పట్టుపట్టు మల్లాజి ఎక్కడనైనను జయింపఁగలఁడు. అతని ప్రయాణమును గూర్చి ఆశ్చర్య మెందుకు?"

"దీపాబాయి-మల్లాజి అహ్మదునగర ప్రయాణము నకు 'మూట-ముల్లె' సర్దుచున్నారఁట. దీనికి కారణము అమ్మగారి ప్రోద్బలమా? అయ్యగారి ప్రోత్సాహమా?"

" 'క్రొత్త వింత-ప్రాఁతరోఁత' అన్నట్లు అహ్మదు నగరపు అందచందము లాకర్షించినవి కాబోలు. మల్లాజి మకాము మార్చుచున్నాఁడఁట.'!

"దీపాబాయి! మల్లాజి!! ఊరిలో ఎందఱు లేరు వారివంటివారు? ఎవరికి కావలె వారి రాకడ-పోకడలు? 'ఎవరికి వారే-యమునా తీరే.' "

అని ఊరిలోని పలువురు తలకొకపలుకు పలికిరి.

స్నేహితులు పెక్కురు ప్రయాణపువేళ ఆ ఆలు మగలఁ జూచి మాటాడ వచ్చిరి.

"మనుష్యులు దూరమైనను, మనసులు దూరము కానీయకుఁడు సుమా!"

"క్రొత్త ఊరు చేరినను, ప్రాఁత స్నేహితులను మఱువకండి."

"మన ఊరని మఱల ఒకసారి వచ్చి వెళ్ళండి."

"ఎక్కడనైనను సుఖముగ ఉండుటే మాకు పదివేలు!"

"మంచిది. క్షేమానఁ బోయి, లాభాన రండి."

"వెళ్ళివత్తుము."

"ఇఁక సెలవా?" అని చూడవచ్చినవారి పరామర్శలు, వీడ్కోలు పలుకులు ముగిసినవి. ప్రయాణము సాఁగినది.

# 3

"హా, హా, ఓహోహో! ఎందుకోయి ఈ నవ్వులు—ఈ కిలకిలలు? ఏమి కానవలెను? నీవు, నీ బోసి నోరును—ఎంత చక్కఁగ ఉన్నావు! నా చిట్టి తండ్రీ! నా బంగారు తొలక..."

"నా వరాలమూటగూడ," అనుచు మల్లాజి కొడుకు నాడించుచున్న దీపాబాయిని చేరవచ్చెను.

"చూచితిరా—వీరు వచ్చుసరికి కేరింతలు మాని పెద్ద మనుష్యునిలాఁగ ఉన్నాఁడు!"

"ఔను మఱి తండ్రిమీఁద గౌరవముఁ జూపుట ఇపుడే తెలిసికొన్నాఁడు."

"కాదు, కాదు. నే నంటే ఎక్కువ సరదా."

"కావచ్చు. కాని, నేనంటే ఎక్కువ గౌరవము."

పాజి తన ఊయెలకు రెండువైపుల నిల్చిన తలిదండ్రులం జూచి మఱల కేరింతలు మొదలుపెట్టెను.

దీపా : అమ్మక చెల్ల ! ఎంత గడుసరివిరా !

మల్లా: చూచితివిగా - ఇంతలోనే తెలిసినది, ఇద్దఱు ఒకటే అని. అందుకొఱకే నవ్వు.

దీపా : బుడుతండు వ్రేలెండైనా, బుద్ధిపుట్టెండు ఉన్నదిలెండి. మగవాండు కాంబట్టి తండ్రి పక్షమైనాండు. అదిగో, మీా పక్షమే అన్నట్లు జోసినవ్వులు వెళ్ళంబోయు చున్నాండు. ఏమోయి! చందమామను వెక్కిరిస్తున్నావా ?

మల్లా: చందమామనే కాదు. అందమైనవారము అనుకొను వారిని అందఱను వెక్కిరిస్తున్నాండు.

దీపా : కావచ్చు, మీా గుణమే వచ్చినది కాంబోలు!

మల్లా: కాక ?

దీపా : కాక ! లేక ! చివఱకు మీారే ఏకము.

మల్లా: ఇంటిపని నంతయు వంటలక్కకు అప్పగించి, రోజంతయు దగ్గఱంగూర్చుండి నీవు ఎంత నూఱి పోసినను నాగుణముకాక నీ గుణము వచ్చునా?

దీపా : వచ్చెడువాని మాటకాదు, వచ్చినవాని మాట - నేను చెప్పుచున్నది. ఇంతకు నేను నూఱునది, పోయునది - వస, ఉగ్గు. గుణములను నూఱిపోయవలసినది

ఏ మున్నది? భోగ్స్లాలలో 'నోట క్రవే లుంచిన కొఱక లేని వారు' ఎవ రున్నారని మన పాజికి గుణములు నేర్పవలసిన అవసర ముండుటకు? అదుగో, చూడండి. అంతయు అర్థమగుచున్నట్లు కన్నులు త్రిప్పుచున్నాఁడు! నా చిట్టితండ్రి నవ్వితే నవ రత్నాలే!

మల్లా: అన్నియు నీకే కాఁబోలు?

దీపా: కొన్ని మీకుఁగూడ. ఇవిగో, తీసికొనండి. మీ భాగము.

అనుచు బాలుని ఊయెలను కదిపి మల్లాజి వైపు త్రోసెను.

మల్లా: మఱి నీ వంతు తీసికో.

అనుచు ఊయెలను దీపాబాయి వైపునకు తిరిగి త్రోసెను.

దీపా: మీ పక్షమువానితో నా కేమి లెండి.

అని నవ్వుచు ఉయ్యాలను మఱల త్రోసెను.

మల్లా: కాదు, నీ పక్షమేనఁట.

అని నవ్వుచు ఊయెలను తిరిగి త్రోసెను.

ఇటు లాదంపతులు సరసముగ, సంతోషముగ సంభాషించుచు తమ ముద్దుబిడ్డని ఊయెల నూఁచసాఁగిరి. రెండుపక్షములు తనకొకటియే అన్నట్లు పాజి అందు హాయిగ నిద్రించెను.

"పా మీాపక్షమో, నాపక్షమో తరువాత తేల్చు కొందము; ముందు అతఁడు శుక్లపక్షపు చంద్రుఁ డని ఒప్పు కొందురుకదా?" - అనుచు దీపాబాయి మల్లాజిపై చిఱు నగవులఁ జిందెను.

*　　　　*　　　　*

# 4

"వెన్నెలరోజులు వచ్చినట్లే. రాకపోవు. పనులు కాకపోవు. కాని, యింకను మబ్బుతెరలు మాత్రము పూర్తిగ విడువలేదు. విడువకపోవు. ఏమైనను ప్రభుత్వపు కొలువులోఁ జేరవలెను. అన్నట్లు, సుల్తాను దర్శనము సులభమైనను, ప్రభుత్వోద్యోగము మాత్రము సులభముగ లభించదుకదా! ఎంతటివారికో కాని అది సాధ్యముకా దని వినికిడి. ఎంత వెట్టిని! ప్రయత్నింపకయే పని కా దని నిరుత్సాహముఁ జెంద నేల? విఘ్నములు కలుగు నని, పనులు విఫలము లగు నని శంకించి ప్రయత్నములను ముందుగనే విడుచుట ఎట్టి వివేకము? ఆత్మవిశ్వాసము లేనివాని కన్నియు ననుమానములే; అన్నిటికి సంశయములే. అట్లని, ఏమో - 'అందనిమ్రాని పండ్లకు అఱ్ఱులు చాఁచుట' వివేకముకాదు కదా?...ఏమీా, అందనిమ్రాని పండ్లేమి? విద్యావంతుఁడను; ఉన్నత వంశజుఁ డను; వ్యవహార దక్షత లేనివాఁడను కాను; కాసు కాసపడి

కాని పనులను చేయువాఁడను కాను...నన్ను నేనే పొగడుకొనుటయా? కూడదు; కూడదు. నాశక్తిఁ జూపి ప్రభువును మెప్పించవలయును. సాటియుద్యోగుల పొగడ్త లందవలెను. ప్రజల యభిమానమును సూఱఁగొనవలెను...బాగున్నది! ఇంతలో ఎంత దూరముపోతిని! ఎందుకీ గాలిమేడలు? కాదు, కాదు. గాలిమేడలు కావు; కారాదు. గాలిమేడలు కట్టుట భోంస్లా వంశీయులకు తెలియనిపని. ఇది నిశ్చయము. నా గౌరవమునకు వన్నెదెచ్చు ప్రభుత్వోద్యోగము వచ్చితీరును. నేఁడుకాకున్న రేపు. కాని రోజు మల్లాజి కాని రోజు'' - అని మల్లాజి ఒకరోజు సాయంతనము తన భవనమున పడక కుర్చీలోఁ గూర్చుండి తనలో ననుకొనుచుండెను. అంతలో నౌకరు గణేశ్ వచ్చి అతనిని దర్శించుటకు ఒక పెద్ద మనుష్యుఁడు వచ్చి వేచియుండె నని చెప్పెను. ''ఆయనను లోనికి రమ్మనుము,'' అని మల్లాజి పల్కెను. పెద్ద మనుష్యుఁడు లోనికి వచ్చెను.

మల్లా: ఓహో, దిగంబరరావుజియా ! రా. కూర్చుండుము.

దిగం: ఏమి, మల్లాజి! ఏదియో దీర్ఘముగ ఆలోచించుచున్న ట్లున్నావు? నాతో చెప్పఁదగని విషయము కాదుకదా?

మల్లా: మిత్రుఁడ వగు నీకు చెప్పక దాఁచవలసిన దేమైన నుండునా?

దిగం: అట్లయిన వినఁగోరెదను.

మల్లా: వినిన మాత్రమున మిత్రుఁడవగు నీ విధి తీరు నను కొనకుము. అవసరమైన సలహానిచ్చి సాయము చేయుదుననుము.

దిగం: నాతో నేఁడేమో క్రొత్త మనుష్యునితోవలె మాట లాడుచున్నావు! నేను సాయము చేయఁగల విషయ మైనచో, సాయము చేయుమనని నాచే చెప్పింపఁ గోరుటకంటె, ఆ పనిని చేయుమని మిత్రత్వములో నన్ను ఆజ్ఞాపించుటకు నీకు హక్కు లేదా? ఇంత కాలము నుండి నన్నెఱిఁగియు, ఇంతగ సంశయ మేల?

మల్లా: నిజము, దిగంబరరావుజీ! నిజము. ఏదియో అల వాటు చొప్పున ఇట్లంటిని. కాని, నీగుణము తెలి యక కాదు.

దిగం: మల్లాజీ! అవసరములు కలుగుట అందఱకు సహజము. స్నేహములో ఒకరికొకరు సాయము చేసికొనుట గూడ సహజమే. సహజమే అన నేల? అది మన ధర్మము. స్నేహమనునది పవిత్రమైన సంబంధము. అంతస్తులతో-ఆస్తిపాస్తులతో - కుల గోత్రములతో ఇందు పని లేదు. చుట్టఱికమునందుకంటె స్నేహ ములో గొప్ప విశిష్టత, ఎక్కువ అన్యోన్యత-ప్రేమ- అభిమానము నుండును. స్నేహితునకై ప్రాణమైన నిచ్చుట మనకు సంప్రదాయము. తనపై తన కెట్టి స్వాతంత్రత, అధికారము నుండునో - స్నేహితునిపైఁ

గూడ అట్టి స్వతంత్రత, అధికారము నుండును; లేనినాఁడు అది నిక్కమైన స్నేహము కాదందును. మల్లాజి! నీవంటి ఉత్తమ స్నేహితుని కోర్కెను-కాదు, ఆజ్ఞను-త్రోసివేయునంతటి అవివేకిని కాను.

మల్లా: దిగంబర్, దిగంబర్! క్షమింపుము. నేను మాములుగ ఏదియో అంటిని. దానికై ఇంతగ చెప్పవలెనా? నీ ఉదార హృదయము నే నెఱుఁగనిది కాదు. నీవంటి స్నేహితుఁడు నిధి వంటివాఁడు. మనము స్నేహితుల మగుట నా సుకృతము.

దిగం: (నవ్వుచు) మల్లాజి! మాటవరుసకు లోకపు తీరు చెప్పితిని. కాని, యిందు ప్రత్యేకముగ మనమాట ఏమియు లేదు. ఇంతకును విశేష మేమియో చెప్పక పోతివి?

మల్లా: (నవ్వుచు) స్వవిషయమే.

దిగం: అన్నచో?

మల్లా: అహ్మదునగరపు సుల్తానుగారి కొలువులో చేరవలె నని కోరిక.

దిగం: మంచిది. కోరిక బాగున్నది. తప్పక తీరవలసిన దే.

మల్లా: అనఁగా?

దిగం: అనఁగా, చేరఁదలఁచినది యోగ్యమైన స్థానము; దానికి కావలసిన అర్హత లన్నియుఁగలవాఁడవు; ఇఁక పని జరుగకుండునా అని తాత్పర్యము.

మల్లా: (నవ్వుచు) నీ తాత్పర్యము, నా ప్రతిపదార్థము బాగుగ నుండవచ్చును. కాని, పని జరుగు టెట్లని నా సంశయము. తగిన మార్గముఁ జూపు మనియే నిన్ను కోరుట.

దిగం: ఏమి మల్లాజీ! అన్నివిధముల ఉన్నతపదవికి అర్హత గల నీ వాశ్రయించినచో సుల్తానుగారు కాదనునా? అతఁడు ప్రతిభను గుర్తించి సత్కరించు ప్రభువు అని వింద్రముకదా? మఱి నీసంశయ మేమి?

మల్లా: నిజమే, నీవు చెప్పినట్లు సుల్తానుగారు అట్టివాఁడే కావచ్చును. కాని, 'దేవుడు వరమిచ్చినను పూజారి వరమీయఁడు' అని సామెత యున్నదికదా? సుల్తాను చుట్టునుండువా రెవరును 'పానకములో పుడక' పనికి పూనుకొనకుండవలెను; తగిన సమయమున సుల్తాను దర్శనము జరుగవలెను. అప్పుడు కదా సుల్తాను మనసు రంజించునట్లు మాటలాడి నైపుణ్యముఁ జూపఁగల్గునది. తరువాతి 'వారి చిత్తము, మన భాగ్యము.'

దిగం: అట్లయినచో, మనము ముందుగ యాదవరావుజిని చూతము. అతఁడు నే నెఱిఁగినవాఁడు. సరసుఁడు. గొప్ప జాగీరుదారు. అతని ప్రతిష్ఠనుగూర్చి యిప్పటికే నీవును వినియుందువు. సుల్తాను మనసు కెక్కిన వారిలో నతఁ డొకఁడు. మన కీ విషయమున అతని

సాయము తప్పక జరుగు నని నాకు నమ్మక మున్నది. పరిచయమేర్పడినచో త్వరలోనే మీరు ఒకరి నొకరు విడచియుండఁజాలనంతటి మైత్రి పెంపొందించుకోనఁ గలరు.

మల్లా: ఔను, యాదవరావుజిపలుకుబడినిగూర్చి వినియున్నాను. ఆయన నెపుడు చూాత మందువు?

దిగం: ఎప్పుడో అన నేల? 'శుభస్య శీఘ్రు' మ్మని పెద్దల వాక్యము. రేపే వెళ్లుదము.

మల్లా: దిగంబర రావుజి! నాయందు నీకు ప్రేమ అపారము.

దిగం: స్నేహములో ఇట్టి ప్రశంస కూడదు. అన్నియు చక్కఁబడినపుడుసుమీ మన పరిశ్రమ ఫలవంతమైన దనుకొనవలసినది. తప్పక పని జరుగు ననియే నానమ్మకము. మన ప్రయత్నము మనము చేయుదము. రేపు మఱల కలియుదము; నేఁటికి సెలవా?

అనుచు దిగంబర రావు మల్లాజి యిలు విడచి గృహోన్ముఖుఁడయ్యెను. మల్లాజియును బయటికి వచ్చి, దిగంబర రావును కొంతదూర మంపి, తిరిగివచ్చుచు, " 'అడఁబోయిన తీర్థ మెదురైనది.' దిగంబరరావు సూచన ఫలింపవచ్చును. రేపటితో నా ప్రయత్న మొకరూపము నందవచ్చును.'' అనుకొనుచు లోని కేగెను.

## 5

మల్లాజికి చెప్పిన మాటచొప్పున మఱునాఁడు దిగంబరరావు మల్లాజిని వెంటనిడుకొని రఘోజీ యాదవరావు భవనమున కరిగెను. యాదవరావు వారిని సగౌరవముగ గూర్చుండఁజేసి కుశలప్రశ్నము జరిపెను. ఉచితరీతిని జవాబొసంగుచు దిగంబరరావు మల్లాజి విషయము ప్రస్తావన సాఁగించెను.

దిగం: మీ పేరు ప్రతిష్ఠలను విన్న మల్లాజి మిమ్ము దర్శింపవలె నని మిక్కిలిగ ఉవ్విళ్లూరుచుండుటచే స్వతంత్రించి నేను వెంటఁబెట్టుకొని వచ్చితిని.

యాద: ఎంతమాట! మిత్రుఁడవు, నీకు లేని స్వతంత్రత ఏమి? నీకు మిత్రుఁడైనచో నాకును మిత్రుఁడేకదా?

దిగం: ఈ ఒక్కమాటవలననే మీ సౌజన్యము, మాయందు మీ అనురాగము, అభిమానము వెల్లడియగుచున్నవి.

మల్లా: నేఁడు సుదినము. 'సజ్జనసందర్శనము సంపత్కర' మని పెద్దల నుడి. ఇన్నినాళ్లుగ మిముఁగూర్చి వినుటయే కాని, మిము స్వయముగ దర్శించి, మీతో భాషించు భాగ్యము కలుగలేదు. మిత్రుఁడు దిగంబరరావుజి ధర్మమా అని నేఁటి కదియు సిద్ధించినది.

యాద: మీ రేమో పెద్దమాటలతో ననుగూర్చి హెచ్చుగ

పలుకుచున్నారు!

మల్లా: మీ నయభాషణము మీ ఉన్నతికి మెఱుఁగువెట్టు చున్నది

దిగం: సాధారణముగ ఎంతయో పరిచయముండినఁ గాని యెదుటివారి తత్వమును సరిగ తెలిసికొనుట సాధ్యము కాదు. మల్లాజి కుశాగ్రబుద్ధి. ఇతఁడు సూచినట్లు మీ సహజమగు సౌజన్యము నింతలో తెలిసికొనఁ జాలెను. గుణవంతులు గుణవంతుల నాకర్షింతు రనుట ఇట్టిదేకదా? మంచి షరాబు రత్నము విలువను ఇట్టె చెప్పును; గాజుకుప్పెను అంటకయే ఆవల నుంచును. ఎదిరి ప్రతిభ నెఱిఁగి వర్తించుట భోంస్లాలకు వెన్నతోఁబెట్టిన విద్య. విద్యావంతుఁడగు మల్లాజి మాటలపొందిక, వ్యవహారిజ్ఞానము మెచ్చఁదగినవి.

యాద: నిజ మంతియె. భోంస్లాలు ప్రతిభావంతు లనుటకు సంశయ ముండదు. మల్లాజితో పరిచయ మమూల్యము. ఇతఁడును అహ్మదునగరవాసి యయ్యెఁ గాన, మన యీపరిచయము వృద్ధియై, శాశ్వతముగ నిలువఁ గలదనుకొనవచ్చును.

మల్లా: అదియె నా కోరిక — ప్రార్థన.

దిగం: నాకు మిక్కిలిసంతోషమగుచున్నది. మల్లాజి అహ్మదు నగరవాసి యగుటయె కాదు. మఱియొక అడుగు

ముందుకు సాఁగి, తనసామర్థ్యముఁ జూపి అహ్మాదు నగరపు అభినందనము లందఁగోరుచున్నాఁడు.

యాద: సుల్తానుగారికొలువులోఁ జేరవలె నని ఉద్దేశము కాఁబోలు ?

మల్లా: అర్హతయున్నచో, నా ఆశయ మది. నా అర్హతను నేను చెప్పుకొనుటకంటె, మీవంటివారు చూచి నిర్ణయించుట అవసరము. అర్హత లేదని నేను తెలిసికొన్నచో తక్షణమె నా కోరికను విరమించుకొనఁగలను. 'గొంతెమ్మ కోరికల' వలన ప్రయోజన ముండ దని నా నమ్మకము.

యాద: మల్లాజికి మంచి భవిష్యత్తు కల దని తోఁచుచున్నది.

మల్లా: మీ ఆశీర్వాదబలము

దిగం: సుల్తానుగారి దర్శనమైనచో, మల్లాజికోరిక నెఱవేఱఁగల దని నా నమ్మకము. ప్రతిభావంతులకు అహ్మాదు నగరము ఆశ్రయ మని ప్రతీతి. మల్లాజి అదృష్టము మంచిదైనచో సుల్తానుగారి కొలువు దొరకును.

మల్లా: నేఁటి యీ సమావేశముతో సంశయములను మబ్బుతెరలు విచ్చినవి. భవిష్యత్తును పాఱఁజూచినచో బంగారు రేఖలు పొడగట్టుచున్నవి.

యాద: ఇంతటి ఉత్సాహవంతునకు నెఱవేఱనిపని యుండదు.

మల్లా: మీ దర్శనమున నా ఉత్సాహ మినుమడించినది.

దిగం: ఉత్సాహమె కాదు. ఉన్నతియు నినుమడించును.

యాద: (చిఱునగవుతో) నామీఁద ఏదియో పెద్ద భారము పెట్టఁ జూచుచున్న ట్లున్నది.

దిగం: మల్లాజికి సుల్తానుగారి దర్శనము చేయింపుఁ డని మా కోరిక.

మల్లా: మా ప్రార్థనను మన్నింపక తప్ప దని మనవి.

యాద: సుల్తానుగారి దర్శనము సులభమైనపనియే. దానికై మీరు న న్నింతగ ఏల కోరుచుంటిరో తెలియదు.

మల్లా: సుల్తానుగారిని దర్శించుట సులభమె కావచ్చును. కాని, మిముబంటివారి పరిచయభాగ్యముగలవాఁడ వని ఆయన తెలిసికొనినఁగాని కార్యము ఫలింప దని నా తలంపు.

దిగం: మల్లాజి స్వయముగనె సుల్తానుగారిని దర్శింపఁగలఁడు. దానివలన ప్రయోజన మేమి? సుల్తానుగారిదర్శన మందఱకు లభింపవచ్చును. కాని, ఆయనదయ లభించుట అంతసులభము కాదు కదా? అందుకై యెక్కువ యోగ్యత అవసరము. అది మీతోడి పరిచయము. తగిన సమయముగూడ సమకూడ వలెను. అది మీరు విచారించి యెఱింగింపవలెను.

యాద: అట్లె కనుఁగొందును.

దిగం: మీ మాట సుల్తానుగారి మనసుకెక్కును.

యాద: ఇంతకును అవకాశముగూడ ఉండవలెనుకదా?

మల్లా: అది నాభాగ్యము.

యాద: అవకాశమునుబట్టి ఆలోచింతము.

దిగం: మీ లున్నంతలో సాయముచేయుఁడు.

యాద: ఇన్నిమార్లు చెప్పవలెనా ?

మల్లా: మీ ఆదరణకు కృతజ్ఞుఁడను.

దిగం: సెలవా ?

మల్లా: నేఁటికి సెలవు.

యాద: మంచిది పోయిరండు.

పని ఫలవంతము కాకపోదనుకొనుచు దిగంబరరావు, మల్లాజి గృహోన్ముఖు లైరి.

# 6

"కాయా, పండా? చెప్ప రేమి? ఆలోచన ఎందుకు? కాయా? పండా? పలుకరు? లేఁడా? కాదనినాఁడా? దిగంబర రావుజీ మాటలు నీటిమూట లేనా? సంగతి ఏమిటి?" - అని, గుమ్మములో కాలిడుచున్న మల్లాజిపై ప్రశ్నల పరంపర సాగించినది దీపాబాయి. చంకలోనిబిడ్డను సవరించి ముద్దిడుకొనుచు, "ఏమిటి, ఏమాటయు చెప్పరు! కన్నులప్పగించి నిలుచుట నేర్చుకొనుచున్నారా ఏమి? పోయినపనిఏమయ్యెనో ఇంటికి వచ్చినవెంటనే చెప్పవలె నని ఇం కెప్పుడు నేర్చుకొందురో? ఇదుగో, పాజి. నాకుఁగాకున్న వీనికైనఁ జెప్పుఁడు.

కాయా, పండా?'' అనుచు ఆమె మఱల ప్రశ్నించినది.

"కాయకాదు, పండుకాదు,'' అనుచు చిఱునగవుతో మల్లాజి మెల్లగ పల్కెను.

దీపా: ఇదెక్కడి విడ్డూరము! క్రొత్తపట్టణమునకు వచ్చుటతో క్రొత్తవిద్యలు పట్టువడుచున్నవి కాంబోలు! కాయ కాదంట, పండు కాదట! ఎక్కడిసరసము! ఎవరైన విన్న నవ్విపోదురు. చాలులెండి! ఫలిత మేమియో ముందు చెప్పండి. తరువాత మీ చమత్కారముల సంగతి చూడవచ్చు.

మల్లా: చెప్పుచుండంగనె ఇంత తొందర యేల? నిజమిదియే. కాయకాదు ; పండుకాదు ; దోరమాంగినది.

దీపా: అనంగా ?

మల్లా: వినంగా తెలియును.

దీపా: వీనులవిందా ?

మల్లా: తేనెలపొందు గూడ.

దీపా : సరి, దారికి రండి. యాదవరావుజి కన్పించెనా ? దిగంబరరావుజి యిక్కడ చెప్పినంత చనువుగా ప్రవర్తించెనా ?

మల్లా: దీపా! నీకు అన్నియు అనుమానములే. అందులో ఆత్రము హెచ్చు.

దీపా: లేదు లెండి. అట్లయినచో తిన్నగ నున్నసోఫాపై కూర్చుండి, చల్లగా, మెల్లగా, విశ్రాంతిగా

ఒక్కొక్క మాట ఒక్కొక్కసారిగ చెప్పండి. ఇదిగో, మీకు తోడు,—అనుచు పాజిని అందిచ్చెను.

**మల్లా :** పాజి, బంగారుకొండ. నీని అదృష్టమె. పని అనుకూల మగు ననియె తోఁచుచున్నది. యాదవరావుజిని కలసి మాటలాడినారము. అతఁడు మంచి ఆదరణ చూపినాఁడు.

**దీపా :** యాదవరావుగారన్నచో సుల్తానునకు గుండెకాయ యఁట. ఆయన పలుకుబడి, ఐశ్వర్యము మొదలగు వానినిగూర్చిన ముచ్చట్లు వినిన ముక్తాబాయి, ఇందుబాయి చెప్పిరి. ఆయన చాల మంచివాఁడని పేరఁట. కనుకనె మీ ప్రయత్నము సఫలమగు నని నాకు నమ్మకము కలిగినది. అందువలననె ఆ మంచిమాటను చెవిలో వేసికొనవలె నని తొందరపడితిని.

**మల్లా :** నీవు విన్నది నిజమె. చూడఁగనె యాదవరావు అట్టివాఁడనియె నాకు తోఁచినది. ఆయనతో మాటాడుటయె గౌరవ మనిపించినది.

**దీపా :** సుల్తానుగారికి సిఫారసు నిచ్చెద ననినాఁడా?

**మల్లా :** సామాన్యులకును, గొప్పవారికిని గల భేద మదియే. ఆయనవలె సుల్తానుగారితో పరిచయమున్న ఇంకొక వ్యక్తియైనచో – అడుగఁగనె, 'సుల్తానుగారా! నే నెంత చెప్పిన అంత,' అని పల్కెడివాఁడే.

**దీపా :** మఱి, ఆయన ఏమనెను?

మల్లా : ఏమని ననుకొందువు ?

దీపా : నేననుకొనుట కేమి లెండి. అనిన దేదియో చెప్పండి.

మల్లా : 'అవకాశమునుబట్టి ఆలోచింతము,' అనెను.

దీపా : ఈ మాటనుబట్టుకొనియేనా దొరమాఁగినదని సంతో షించుచుండిరి ? అయినచో, 'సరి కాదు' నట్లే.

మల్లా : పొరపడుచున్నావు. తప్పక చేయఁదలఁచిన పనిని గూర్చియు అట్లనుట గొప్పవారి లక్షణము. అంతటి వాఁడు ఆ మాత్రమనుటయె పదివేలు నీవు లోకపు పోకడను బాగుగ గమనింపవు. ఎట్టి పనికైనను, 'అబ్బె, అది దెంత ? తప్పక చేయుదును.' అనువారి వలన పనులు జరుగుట అరిది. పనులు కాని సందర్భ ములలోఁగూడ అట్లనుట వారి కలవాటు. సాధా రణముగ ఫలితము మాత్రము శూన్యము. యాదవ రావుజీ ఆ తరగతికి చెందినవాఁడు కాఁడు. కావు ననె, ఆయనవలన తప్పక సాయము జరుగు నని తలంచుట.

దీపా : మీకు ఎక్కడ నమ్మక మెక్కువయో అక్కడనె నా కనుమాన మధికము; ఏమి చేయుదును ?

మల్లా : ఏమియు చేయ నవసరము లేదు; ఊరక చూచు చుండుము. అన్నియు ననుకూలమగును. ఇదుగో షాజి, నా మాటయె గెల్చునని నవ్వుచున్నాఁడు.

దీపా: కాదు, మీమాటలోనమ్మకము లేదని నవ్వుచున్నాఁడు.

మల్లా : లేదు, నీ అనుమానమునుగూర్చి నవ్వుచున్నాఁడు.
కాదటోయి, షా?

దీపా : అవునటోయి, షా?
అనుచు నిర్వురు, చిదిమిన పాల్గారు షాజి లేఁత బుగ్గలపై ముద్దు లద్దిరి.

* * *

# 7

నాఁడు షాజి పుట్టినరోజు. మల్లాజి యింటిలో ఉల్లాసము వెల్లివిరిసెను. గృహమంతయు చక్కఁగ అలంకరింపఁబడుచున్నది. పనికత్తెలలో పోటి పరవళ్లు త్రొక్కుచున్నది.

"మ్రుగ్గులుపెట్టు నాపని ముందు కావలయు."

"దొరసానిగారిమెప్పు దొరకుట ఎవరికో ఈరోజు చూడవలయు."

"సుందరి పేరులోని అందము పనిలో లేదే?"

"నీ మాటలలోని పస నీరూపములో లేనట్లే."

"అబ్బ! అంత రూపవతివి కాఁబోలు? చిదిపి దీపము పెట్టుటయె తరువాయి ఏమో!"

"ఇట్లు మాటలతో ప్రొద్దు జరిపితివా ముందు నిన్ను చిదిపిపెట్టును దొరసానమ్మ."

"మాటలాడుచున్నను,పనిమానక చేయుచున్నా నని

చూడలేవా ఏమి?"

"నేను చూచు టెందులకు? చూచునది, తప్పు ఉన్న చూచునది దొరసానమ్మగారు."

"కాదులే, ఈ 'కాస్త'లో నీకు మేస్త్రీపని వచ్చినది అనుకొంటిని."

"అనుకొందువు, నీకేమి ఆపా, హద్దా?"

"రెండును ఉన్నవి. కదిలితే నీమాటలు ఆపు; కదలకుంటె నీ ఆకారము హద్దు."

"చాలులేవె, వంగనాచి."

"అయినదమ్మా నాపని. పూలచెండ్లు గ్రుచ్చుట పూర్తియైనది."

"నావంతు గంధము తీయుట కూడ పూర్తియైనది."

"పన్నీరు కలుపు నాపని కాలేదనియా? ఇదిగో, ఇంతలోననె అయినది."

"వచ్చుచున్నారు అపుడె ముత్తైదువలు."

"అందఱు పిలుపు అందినవారేనా?"

"గొప్పవారి యిల్లు అనఁగానే పిలువనివారు గూడ కొందఱు వచ్చుచుందు రని నీవు ఇంకను తెలిసికోలేదా?"

"చాలులేవే, పిల్లకానా! చాలించు నీ ప్రసంగము. 'కందకులేని దురద చేమకెందుకు?' గొప్పవారి విషయములు ఎటుచెప్పినను కష్టమె. కత్తిమీఁది సాముపంటిది. 'కంటికి తగిలే పుల్లను కనిపెట్టి నడువవలె' అని మఱచిపోకు,"—

అనుచు తలకొక మాట దొర్లించుచు పనికత్తెలు తమతమ వంతు పనులను చక్కఁబెట్టిరి.

ముత్తైదువలు వచ్చిరి. దీపాబాయి స్వయముగ పేరు పేర అందఱ నాదరించి కూర్చుండఁబెట్టెను. పాజి చక్కఁగ అలంకరింపఁబడెను. వేడుకలు ప్రారంభమయ్యెను. ఒక ప్రక్క పాటలు; వేఱొక చక్కి మాటలు; ఒండొరుల కుశల ప్రశ్నలు; వరుస మాటలు; 'ఎకచకలు, పకపకలు!'

ముత్తైదువలకు మర్యాద లన్నియుఁ గ్రమముగ జరుగుటకు దీపాబాయి యేర్పాటుగావించెను. కొందఱు పీవనలు పట్టుటకు నియమింపఁబడిరి. పసుపు పూయుటకు కొందఱు. బొట్టు పెట్టుటకు మఱికొందఱు. పండ్లు పంచుట కొందఱి పని. పన్నీరు చల్లుట మఱికొందఱి విధి. అత్తరుపూయుట కొందఱి వంతు. తాంబూలము లిచ్చుట మఱికొందఱివంతు. 'పింగళి వారి పేకివలె చెప్పుటయె తడవుగ అందఱు అన్ని పనులను నిర్వర్తించుచుండిరి. దీపాబాయి చూపు ఆదరణకు, చతురతకు ముత్తైదువలు మురిసిపోయిరి.

"చిట్టిబాబు సింగారమును వదినెగారె స్వయముగ చేసిన ట్లున్నది?"—అన్నది ఒక లతాంగి.

"అది మా అన్నగారి ఆజ్ఞయేమో?"—అని అందు కొన్నది ఇంకొక యిగురుబోఁడి.

"అయినను వదినెగారి వాసి తగ్గదులే," అనినది తొలుతటి శొయ్యాలి.

"వాసి హెచ్చునేమో!" అని కల్పించు కొన్నది వేఱొక కాంతామణి.

"వారి వాసి-వన్నె కొలుచు కొలతబద్దలా ఏమి మీరు?"—అని సూటిగ ప్రశ్నించినది మఱొక సుందరాంగి.

"కొలతకు అవసరము భేదముండినఁగదా వారిలో," యని సూచించినది కొండొక సుదతీమణి.

"చెల్లెండ్రు తర్కములో పడిరి. అయినను నాకెందుకు, పెద్దదానను? మంచి వేడుక జరిపినది దీపాబాయి. ఈమె కడుపు చల్లగ పాజి నూతేండ్లు వర్ధిల్లవలె. ఈ అత్తరు పన్నీరులవలె పాజి గుణములు అందఱిని ఆకర్షింపవలె," అని ఆశీర్వదించిన దొక పండుముత్తైదువ.

"పాజికి తమ్ములు, చెల్లెండ్రు తప్పక కలుగవలెను," అని నవ్వుచు పలికిన దొక జవ్వని.

"అంతే, అంతే," అనుచు వారిజాక్షులు కొందఱు వంత పాడిరి.

ముత్తైదువలు పెక్కు రీతుల పాటల వెంట మాటలఁ గలుపుచు, పండుగకు నిండుసొంపు నించి, పూర్తి గావించిరి. వారి పలుకులకు దీపాబాయి చిఱునగవుదొంతరలు జవాబులుగ వర్తించెను.

* * *

# 8

దిగంబరరావు మూలమునఁ గల్గిన పరిచయమును పురస్కరించుకొని మల్లాజి యాదవరావు భవనమునకు రెండు, మూఁడుసారులు వెళ్ళివచ్చెను. 'లోకాభిరామాయణము'తో ప్రసంగములు జరిగెను. కాని, సుల్తానును చూచువిషయమై యాదవరా వేమియు సూచింపలేదు. మల్లాజియు మాటాడుటకు సాహసించలేదు.

రోజులు గడచినవి. మాసములు నడచినవి. కాని, మల్లాజి కోర్కెనుగూర్చి యాదవరావు ఒక్కమాటయు మఱల పలుకలేదు. చూడవెళ్లినపుడెల్ల మల్లాజికతఁడుచూపు మర్యాదలో లోటు లేదు. 'తొలినాఁ డెట్లో మలినాఁడు నట్లే' యనిన ట్లుండెను. కాలముమాత్రము దొర్లుచుండెను.

మల్లాజిస్థితి యిఱకటమైనది. కోరిక తీఱకపోయె నని మనసులో ఆవేదన.

"ఏమండీ, యాదవరావు ఏమనినాఁడు?" అని రోజు రోజు ఇంటిలో ఇల్లాలి ప్రశ్నలు.

"పదేపదే చెప్పుట పాడిగాదు. చెప్పినమాట మఱచువాఁడు కాఁడు యాదవరావుజి," అని దిగంబరరావు ఓదార్పు.

"నా విషయ మేమి చేసితిరి? అని యాదవరావును సూటిగ ప్రశ్నించుద మన్న,—తొందరపడినచో పనులు కావుసుమీ— అని మందలించు నేమో? నే నడుగక మిన్న

కున్నచో, అవసరమున్నవాఁడు అడుగక పోయెనని ఉపే క్షించునేమో? దివాణములోని సమాచారము లేమో ఇదమిత్థ మని తెలియుట లేదు. అవకాశ మిప్పు డున్నదో, రానున్నదో, మిగిలిపోయినదో ఎవరు చెప్పుదురు? ఏమిచేయ వలెను? ఏమి చేయరాదు? ఏమైనను పని జరుగవలెను. ఏ పనికిని ఎక్కువ తొందర కూడదందురుకదా? అట్లని యూర కుందునా? అధికముగ ఆలస్యమైనచో అమృతముకూడ విష మగునందురే? మధ్యమార్గ మేమి?" అని మల్లాజి ఆలోచన.

"ఏపనికైనను కొంత సహనము అవసరము. అట్లని సాహసముకూడ కొంత ఉపయోగకరము కాకపోదు. ఏమైనఁ గానిమ్ము. నేఁడు యాదవరావుగారిని కలిసికొని ఏమి జరిగినది కనుఁగొందును. దిగంబరరావును కూడ వెంటఁబెట్టుకొని పోయిన బాగుండునుకదా? నాబదులు అతఁడే ప్రశ్నించును. దానితో విషయము తేలును. కాదు. ఒంటరిగ యాదవరావు గారిని ఎన్నిసారులో దర్శించితిని. ఆయన మిక్కిలి మర్యాదగ మాటలాడుచుండెను కదా? ఇంతలో ఈ పనికై దిగంబర రావును తీసికొని వెళ్లినచో ఒత్తిడి పెట్టినట్లుండును. అందు వలన ఆయన మనసుకు కష్టము కలుగవచ్చును. దాని కేల అవకాశమీయవలెను? అదియె కాదు; చీటికి మాటికి దిగంబరరావును తీసికొని వెళ్లినచో ఎట్లుండును? అతఁడు లేనిదే ఏపనియు చేయలేనివాఁడ నని ననుఁగూర్చి యెవరైన అనుకొనవచ్చును కదా? అట్లయినచో నా కేమి ప్రాముఖ్య

ముందును? ఇదేమి? పనియగుట ప్రధానమా, నా ప్రాముఖ్యము ప్రధానమా? రెండును అవసరమే. కాఁబట్టి రెండింటిని సాధించవలెను. మార్గము? యాదవరావుగారితో విషయమును స్వయముగ ప్రస్తావనకుఁ దెచ్చుటయే''—అని తుదికి నిశ్చయించుకొని, ఒకనాఁటిసాయంతనమతఁడు యాదవరావు భవనమునకు బయలుదేఱెను.

*　　*　　*　　*

## 9

సాయంతనము వేళ పూలతోఁటలో విశ్రాంతిదీసికొనుచున్న యాదవరావును సమీపించి మల్లాజి నమస్కరించెను. యాదవరావు సగౌరవముగ అతనిని ఆసన మలంకరింపఁజేసెను. పూఁదోఁట అందమును బురస్కరించుకొని మల్లాజి సంభాషణ మారంభించెను.

మల్లా: ఈ పూఁదోట మిక్కిలి అందముగ నున్నదండి. మీరు దీనిని గూర్చి ప్రత్యేకముగ శ్రద్ధతీసికొని యుందురు.

యాద: నేను ప్రత్యేకముగ తీసికొనిన శ్రద్ధ యేమి యున్నదండి? మా తోఁటమాలి కష్టించి పనిచేయును. ప్రతి మొక్కను ప్రేమతో పెంచును.

మల్లా: మొక్కలను పెంచుట పిల్లలను పెంచుట వంటిది.

ఎల్లపుడు తగిన పోషణ యుండినఁగాని అవి వృద్ధి పొందవు. ఇంతకు యజమానుఁడు అభిరుచి గలవాఁడైనచో, తోఁటమాలి శ్రద్ధతీసికొనక తప్పదు. చెంత పూఁదోఁట యుండుటవలన భవనమునకు శోభ హెచ్చును.

యాద: అన్ని హంగులు కల్గిననే కదా దేనికైనను అంద చందములు ?

మల్లా: బాగుగ చెప్పితిరి. అది సత్యము, సహజము గూడ.

తాను కోరుకొనినమాట మల్లాజికి మనసులోఁ దట్టినది. కాని, వెలుపలికి పొంగలేదు. తనసమాధానమును పొడిగించినాడు:

"కాని, హంగులను కల్పించుకొనుటకుఁగాని, కల్పించుటకుఁగాని అవకాశములును ఉండవలెను కదా!"—అని.

యాద: నిజమంతియే. అవకాశమును బట్టియే పనులు జరుగును. అవకాశము లేనపుడు అవసర మెంతయున్నను ప్రయోజన మేమి యుండును ?

మల్లాజికి మనసులో ఆందోళన హెచ్చినది. తాఁ గోరిన విషయమును గుఱించియె యాదవరావు అటు లనుచుండెనా ?—అని అనుమానము కల్గినది. మఱల సమాధానము సాగించినాఁడు మల్లాజి :

"సాధారణముగ నంతియె. కాని, కొన్ని సందర్భములలో కొన్ని పనులు జరుగుటకు అవకాశమే కల్పింపఁబడవలసి

యుండును,'' అని.

అట్లనెనుగాని అంతటితో మల్లాజికి మనశ్శాంతి కలుగలేదు. సుల్తానుదర్శనమునుగూర్చి తా నడిగిన విషయమునకు సమాధానముగనే యాదవరావు అట్లనుచుండె నని మల్లాజికి అనుమాన మినుమడించినది. పని కా దని తేటతెల్లముగ చెప్పుటకుఁగాని, తొందరపడకు మని సూటిగ హెచ్చరించుటకుఁగాని యిష్టము లేక అతఁ డట్లనుచుండె ననియె మల్లాజి నమ్మకము. అట్టి స్థితిలో నిఁక యాదవరావును స్పష్టముగ అడుగుటయు లాభము గా దనియె అతఁడు నిశ్చయించుకొనెను. యాదవరావు ఉద్దేశ్యపూర్వకముగ అట్లనుచుండెనో, లేక ప్రసంగవశమున సందర్భమునుబట్టి సాధారణముగ అట్లనుచుండెనో తెలిసికొనఁగోరి మల్లాజి మఱల పల్కెను :

''మీ భవనమునకుఁగల పెద్ద ఆవరణము చక్కని తోఁటను పెంచుట కవకాశ మిచ్చినది. ఇంత ఆవరణము లేకున్నను తోఁట కావలె ననుకొన్నచో అది పెరుఁగుటకు తగిన అవకాశమును కల్పింపలేకపోరు,''—అని.

యాద: ఔను, ఆ మాటయు నిజమే. 'మనసు గల్గిన మార్గముండు'నని సామెత యున్నది కదా ?

తల్లడిల్లిన మల్లాజి మనసు చల్లఁబడినది. ముఖము విప్పారినది. ఆలసింపక అతఁ డందుకొనెను :

''ఔను, ముఖ్యముగ మీబోఁటి వారియెడ ఆసామెత

తప్పక వర్తించును. సమరులు తలపెట్టిన పనులు జరుగక తప్పవు,''—అని.

అంతటితో మల్లాజికి తృప్తి కలుగ లేదు. తానుయాదవ రావు నర్థించిన విషయ మేమయ్యెనో ఎంతకు నతఁడు చెప్ప కుండుటచే లోలోనఁ జింతించెను. విషయము నెట్లైన రాఁబట్ట నెంచి యిట్లనెను :

"మీ పరిచయ మేర్పడినప్పటినుండియు మిమ్ము తఱచుగ దర్శింపవచ్చుచున్నాను. దీనివలన మీపనుల కేమియు భంగము కలుగుట లేదుగదా! ఎక్కువ స్వాతంత్ర్యము దీసికొనుచున్నాను."

యాద: మిత్రులను తఱచుగ కలియుట నాకు సంతోషకర మైన విషయము. దీనికై మీ రింతగ నొచ్చుకొను టెందులకు?

యాదవరావు చెప్పిన సమాధానము సరసముగ నున్నది. కాని, అందు మల్లాజి అనుకొనినమాటలు లేవు. ఇఁక సూటిప్రశ్న తప్పదని యతఁడు నిశ్చయించుకొని యిట్లనెను:

"లోగడ మిమ్ము సుల్తానుగారి దర్శన మిప్పింపుఁ డని ప్రార్థించితిని. మిత్రుఁడు దిగంబరరావుజీకూడ ఆ సందర్భమున 'అదనుచూచి సాయము చేయుఁ'డని మీతో చెప్పెను. నాకీఉపకార మెపుడుజరుగునో తెలిసికొనవలె ననియున్నది."

యాద: ఔను, నేనదియే చెప్పఁబోవుచుంటిని. ఇంతలో మీరే ఆ ప్రసంగముఁ దెచ్చితిరి. నిన్ననే సుల్తానుగారిని

దర్శించితిని. మీవిషయమించుక సూచించితిని. మీరు అన్ని సంగతులను స్వయముగ వారితో చెప్పుకొన వచ్చును. రేపే వారిని మఱల దర్శించుటకు ఏర్పాటు చేసితిని. మన మిద్దరము కలిసియే వెళ్లుదము.

మల్లా: చిత్తము. రేపు సాయంకాలము ఇచ్చటికి వచ్చెదను. కలిసి వెళ్లుదము. మీకు శ్రమ గల్గించుచున్నాను.

యాద: శ్రమ ఏమున్నది? మీపని యగుటయె సంతోషము.

మల్లాజి "సెలవా?" అనుచుండ, "మంచిది, పోయి రండు," అనుచు యాదవరావు మాట గలిపెను.

*  *  *  *

10

మల్లాజి 'రొట్టె నేతిలోఁ బడినది.' సుల్తానుదర్శనమైనది. యాదవరావుమాట గౌరవింపఁబడినది. మల్లాజికి ప్రభుత్వోద్యోగము లభించినది. సర్కారుపనిలో నిప్పు డతనికి శ్రద్ధ యెక్కువ, తీరుబడి తక్కువ.

"ఇదుగో, షాజి. అంతయు వీని అదృష్టమే. ఏమి బహుమతి నిచ్చెదవో వీనికి?"---అనుచు ఒకనాఁడు దీపాబాయి షాజి నెత్తికొని వచ్చి మల్లాజి కందీయఁబోయినది.

"ఉండుండు. షాజికి బహుమతియా? ఇదిగో, వాఁడు నీ చేతిలో నుండఁగా ఒక ముద్దు, నా చేతిలోనికి వచ్చినపుడు

రెండుముద్దులు బహుమతి. అంతేనా, షా ?"-అనుచు మల్లాజి, షాజినందుకొని, ముద్దిడుకొనెను.

దీపా: చాలులెండి, చౌకబహుమతితో సరిపెట్టితిరి. పసికూన వాఁడడుగలేనివాఁడని తప్పించుకొనఁజూచుచున్నారు మఱి నాకేమి బహుమతి? నాకు విలువగల బహుమతి నీయక తప్పదు.

మల్లా: తప్పక. అడుగఁగలదానవు నిన్నెట్లు తప్పించుకొనఁ గలను? విలువగల బహుమతి నీయవలసినదే. మల్లాజి మాటతప్పని వాఁడని నీకు చెప్పనక్కఱలేదు కదా? ఇదిగో, ఇంతకంటె ఎక్కువ విలువగల వస్తువును నీకేమి తేఁగలను? తీసికో, అమూల్యరత్నము-షాను. -అనుచు షాజిని దీపాబాయికి తిరిగి యిచ్చెను.

దీపా: వహ్వా! ఏమి చతురత! సుల్తానుగారి కొలువుతో దొడ్డబుద్ధి రావలసినదే, ఏది? పోనిండు. 'మాది మా కిచ్చుటయే మడిమాన్యములిచ్చుట.' ఇప్పటికిదియె పదివేలు.

మల్లా: అదిగో బండివచ్చినది. అవసరమైన సర్కారు పని కొంచెమున్నది. జరూరు పోయిరావలెను.

దీపా: అబ్బా! అపుడే సర్కారుపని తొందరలు పట్టినవి. ఇంక మీ కింటకాలు నిలువదు. దివాణపు చదరంగముతో తీఱికయె యుండదు కాఁబోలు!

మల్లా: అనుభవముగల ప్రాఁత ఉద్యోగులకె తీఱిక లేకుండ

పనిజేసినను సర్కారు పనిలో మెప్పు పొందుట సులభముకాదు. ఇంక క్రొత్తవారిమాట చెప్ప నెందులకు? ఏమైనను కోరి తెచ్చుకొనిన కొలువు. ఏమాత్రము లోపము గల్గినను మాట దక్కదు.

దీపా: లోప మెందులకు కలుగును? పనుల నన్నింటిని స్వయముగ శ్రద్ధతో చూచుచుంటిరి కదా! ఇంకేమి భయము?

మల్లా: కొండెములు చెప్పువా రున్నచో లేని లోపములు కనంబడును. ఎవ రెట్టివారో పూర్తిగ తెలియనపుడు ఎక్కువ జాగ్రత్తతో నుండవలెను. ఒడలంతయు కన్నులు, చెవులుగ వర్తింపవలెను. ప్రభువును మెప్పించవలెను. తోడి యుద్యోగుల అభిమానమును సంపాదింపవలెను. ఉన్నత పదవులను చేరుట కిట్లు నిచ్చెన మెట్లు పెక్కు లుండును.

దీపా: మీ రాజకీయ శాస్త్రమును, ఉద్యోగసూక్ష్మములను నాముందు వల్లె వేయు టెందుకు? ఇచ్చినవారు మెచ్చవలెను; పుచ్చుకొన్నవారు మెప్పించుకొన వలెను. మధ్య నా కెందుకు? పదవులు, మెప్పులు పంచుకొనను కదా?

మల్లా: క్రొత్తగ పంచుకొను టేమి? అసలు సహభాగినివె కదా?

దీపా: అసలు లేదు, వడ్డీ లేదు.

